## హోమ కుండాలు (శారదా తిలకం)

**చతురస్రం యోని మదర్ధచంద్రం త్ర్యస్రం సువర్తులమ్ ।**
**షడస్రం పంకజాకారమష్టాస్రం తాని నామతః ॥**

చతురస్రం, యోని, అర్ధచంద్రం, త్రికోణం, వర్తులం, షట్కోణం, పద్మాకారం, అష్టకోణం అని హోమకుండాలు 8 రకాలు.



# శ్రీ దేవీ భాగవతంలో చెప్పబడిన కామ్యహోమ ద్రవ్యాలు

భగవాన్ వ్యాస మహర్షి రచించిన శ్రీ దేవీ భాగవతం సుప్రసిద్ధ పురాణ గ్రంథం. ఇందులో 11వ స్కంధం 23.వ అధ్యాయంలో వివిధ రకాల కామ్యాలకు (కోరికలకు) ఏఏ ద్రవ్యాలతో హోమం చేయాలో తెలియచేయబడింది. ఉపాసకులు ఇక్కడ తెలుపబోయే ద్రవ్యాలతో హోమాలు చేసుకుని ఇష్టకామ్య సిద్ధిని పొందగలరని ఆశిస్తున్నాము.

| | హోమ ద్రవ్యము | | నెరవేరే కామ్యము |
|---|---|---|---|
| 1. | పాలు, పెరుగు, నెయ్యి, | – | కన్యాలాభం, వరలాభం, |
| | పేలాలతో హోమం | – | వివాహం |
| 2. | మారేడు సమిధలు, ఆకులు, | | |
| | కాయలు, వేర్లు, పూలు వీటితో హోమం | – | ఐశ్వర్యం ప్రదం. |
| 3. | గరిక, పాలు, తేనె, పెరుగు, నెయ్యి | – | అపమృత్యు నివారణ |
| 4. | జిల్లేడు సమిధలతో హోమం | – | సర్వత్రా విజయం, కార్యసిద్ధి |
| 5. | ఉప్పు, తేనెలతో హోమం | – | ఇష్టజన వశీకరణ |
| 6. | ఎర్రకలువలు, జాజిపూలు, మల్లెపూలు | – | ఐశ్వర్య ప్రదం |
| 7. | పాలుగారె తిప్ప తీగతో హోమం | – | ఆయుర్వృద్ధి, సర్వరోగహారం |
| 8. | మామిడి చెట్టు సమిధలతో హోమం | – | జ్వరరోగ హరం |
| 9. | వచ (వస)తో హోమం | – | క్షయరోగ ఉపశమనం |
| 10. | మేడిచెట్టు సమిధలతో హోమం | – | అతిమేహ రోగ హరం |
| 11. | చెరుకు, తేనెలతో హోమం | – | ప్రమేహ రోగ హరం |
| 12. | అన్నంతో హోమం | – | అన్నవృద్ధి |
| 13. | పాయసం, నెయ్యితో హోమం | – | సంతాన ప్రాప్తి |
| 14. | మోదుగ సమిధలతో హోమం | – | బ్రహ్మ వర్చస్సు |
| 15. | నేతితో హోమం | – | బుద్ధిశక్తి |
| 16. | పాలతో హోమం | – | మేధాశక్తి |
| 17. | నువ్వులు, బియ్యంతో హోమం | – | ఐశ్వర్యం, వశీకరణ |

**కామ్యహోమాన్ని పై తెలిపిన ద్రవ్యాలతో కనీసం 10,000 సార్లు చెయ్యాలి**

# వివిధ హోమకుండ ఫలితాలు

**సర్వసిద్ధికరం కుండం చతురస్రముదాహృతం**
**పుత్రప్రదం యోనికుండం మర్ధేద్వాభం శుభప్రదం ॥**
**శత్రుక్షయకరం త్ర్యస్రం వర్తులం శాంతికర్మణే,**
**ఖేదమారణయోః కుండం షడస్రం పద్మసన్నిభమ్ ॥**
**వృష్టిదం రోగశమనం కుండమష్టాస్రమీరితం।**
**విప్రాణాం చతురస్రంస్యాద్రాజ్ఞాం వర్తులమిష్యతే ॥**
**వైశ్యానామర్ధచంద్రాభాం శూద్రాణాం త్ర్యస్రమీరితం ।**
**చతురస్రంతు సర్వేషాం కేచిదిచ్ఛంతి తాంత్రికాః ॥** (శారదాతిలకం 3వ పటలం)

సుప్రసిద్ధమంత్రశాస్త్రగ్రంథం 'శారదాతిలకం'లో చతురస్ర కుండలంలో హోమం చేస్తే సర్వసిద్ధులు లభిస్తాయని, సంతానం కోసం యోనికుండాన్ని ఉపయోగించాలని, అర్ధచంద్రకుండ సర్వశుభప్రదమని, త్ర్యస్రకుండం శత్రునాశనానికి ఉపయోగిస్తుందని, వర్తులాకారం కుండంలో చేసే హోమం శాంతి ప్రదమని, షడస్ర (ఆరుకోణాల) కుండం మారణకర్మల కోసమని, పద్మాకార కుండంలో హోమం సంపదనిస్తుందని, అష్టాస్రకుండం (ఎనిమిదికోణాల) రోగనాశనాన్ని కలిగించి ఆరోగ్యాన్ని ఇస్తుందని చెప్పబడింది.

బ్రాహ్మణవర్ణం వారు చతురస్రకుండాన్ని, క్షత్రియులు వర్తులాకార కుండాన్ని, వైశ్యులు అర్ధచంద్రకుండాన్ని, శూద్రవర్ణంవారు త్ర్యస్రకుండాన్ని ఉపయోగించడం శ్రేయస్కరమని, చతురస్రకుండం అన్నీ వర్ణాలవారికి శుభప్రదమైనదని తెలియజేయడం జరిగింది. కనుక సాధకులు కామ్యహోమాన్ని ఆచరించేటప్పుడు మీకున్న కామ్యాన్ని అనుసరించి, దానికి తగిన హోమకుండాన్ని ఏర్పరుచుకొని అందులో హోమాన్ని చేస్తే అభీష్టఫలాన్ని పొందగలరు.



## హోమద్రవ్య పరిమాణం (శారదా తిలకం)

**అథాత్ర హోమ ద్రవ్యాణాం ప్రమాణ మభి ధీయతే**
**కర్షమాత్రం ఘృతం హోమే శుక్తి మాత్రం పయః స్మృతం.......** *(పంచమపటలం)*

నూనె, నెయ్యితో హోమం చేసేటప్పుడు ఒక 'కర్ష' ప్రమాణంలో వేయాలి. పాలు 1 శుక్తి ప్రమాణంలో హోమంచేయాలి. పంచగవ్యాలని కూడా 1 శుక్తి ప్రమాణంతోనే హోమంలో సమర్పించాలి. పెరుగు-2 పలాల చొప్పున వేయాలి. పేలాలు ఒక ముష్టి (గుప్పెడు) సత్తుపిండి కూడా గుప్పెడు చొప్పున సమర్పించాలి. బెల్లం, చక్కెర అర్ధపలం చొప్పున హోమంచేయాలి.

పత్రాలు, పుష్పాలు, అప్పాలు, జంతికలు వంటి భక్ష్యాలు ఒక్కొక్కటిగానే వేయాలి. తుంచి వేయకూడదు. అలాగే అరటిపండు, నారింజ వంటి పళ్ళు ఒక్కొక్కటిగానే వేయాలి. ముక్కలు వేయకూడదు. పనసపండు తొనలు వేయకూడదు. ఆ పండును పది ముక్కలుగా చేసి ఒక్కో భాగాన్ని హోమం చేయాలి. అదే విధంగా కొబ్బరికాయను కూడా ఎనిమిది ముక్కలు చేసి ఒక్కోముక్కతో హోమం చేయాలి. దోసకాయ, వెలగపండు, మారేడుకాయను హోమం చేసేటప్పుడు ఆ కాయను 3 ముక్కలుగా చేసి వేయాలి. అలాగే ఇతర ఫలాలను కూడా 3 ముక్కలు చేసి వాటితో హోమం చేయాలి.

హోమం చేసే సమిధలు పది అంగుళాల పొడవు వుండాలి. దూర్వలు (గరిక) కనీసం 3 అంగుళాల పొడవు వుండాలి. తిప్పతీగ నాలుగు అంగుళాల పొడవు వుండాలి. కందులు, మినుములు, పెసలు, గోధుమలు, యవలు, జొన్న, సజ్జలు, రాగులు వంటి తృణధాన్యాలను ముష్టి (గుప్పెడు) ప్రమాణంలో హవనం చేయాలి. బియ్యం అర్ధ గుప్పెడు, తిలలు (నువ్వులు) ఆవాలు ఒక చులుకం (అరచేతి మధ్య గుంటలో పట్టినంత) గ్రహించి హోమం చేయాలి. ఉప్పు 1 కర్షం ప్రమాణంలో గ్రహించాలి. మిరియాలు 21 తీసుకుని (ఒక ఆహుతికి) సమర్పించాలి. గుగ్గిలం, ఇంగువ, చందనం, అగరు, కర్పూరం, కస్తూరి, కుంకుమపువ్వు, చింతగింజలు 2 శోణాల పరిమాణంలో గ్రహించి హోమం చేయాలి.

**హోమం చేసేడప్పుడు అందులో వేసే ద్రవ్యాలను**
**బొటనవ్రేలు, మధ్యవ్రేలు, ఉంగరం వ్రేలుతో కలిపి పట్టుకుంటే ఎంతో వస్తుందో**
**అంతే ప్రమాణంతో హోమం చేయటం ఆచారం.**

# హోమకుండంలో అగ్ని విశేషాలు

## (శారదా తిలకం-పంచమపటలం)

1. సాధకుడు సమిధలతో హోమాన్ని చేసేటప్పుడు అగ్నిహోత్రుణ్ణి నిలబడి ఉన్నట్టుగా ధ్యానించాలి. కేవలం నేయితో హోమం చేస్తున్నపుడు అగ్నిని పడుకున్నట్టుగా భావిస్తూ, ఇతర ద్రవ్యాలతో హోమం చేసేటప్పుడు అగ్నిని కూర్చున్నట్టుగా భావిస్తూ హోమం చేయాలి.
2. పొగతో నిండిపోయిన అగ్నిని శిరస్సు అంటారు. పొగలేని అగ్నిని చక్షువు (కన్ను) అంటారు. నల్లగా జ్వలించే అగ్నిని కర్ణం (చెవి) అంటారు. కేవలం కాష్ఠమాత్రంగా వెలుగుతున్న అగ్నిని నాసిక అంటారు. హోమం చేసే సాధకుడు చక్కగా జ్వలిస్తున్న జిహ్వ అనే అగ్నిలో మాత్రమే హోమం చేయాలి. అగ్ని కర్ణ స్థానంలో అనగా నల్లగా జ్వలిస్తున్నప్పుడు హోమం చేస్తే వ్యాధి కలుగుతుంది. నేత్ర స్థానంలో అనగా ఏ మాత్రం పొగ లేకుండా వున్న అగ్నిలో హోమం చేస్తే మనోవ్యాధి కలుగుతుంది. అగ్ని తల స్థానంలో ఉన్నప్పుడు అనగా పూర్తిగా పొగతో నిండిపోయినపుడు హోమం చేస్తే దరిద్రం, ధననష్టం చేసినవాడికి కలుగుతాయి.
3. హోమగుండంలో వున్న అగ్ని సిందూరం, బంగారం ఉదయించే సూర్యుడు కుంకుమపువ్వు, తేనె రంగులలో వుండాలి. వీటిలో బంగారు రంగు శ్రేష్ఠం.
4. హోమం చేస్తున్నప్పుడు హోమకుండం నుంచి భేరీ, మేఘ గర్జన, ఏనుగు ఘీంకారం లాంటి శబ్దాలు వస్తే మంచిది. అలాగే కుండం నుంచి నాగ, సంపెంగ, మల్లి, జాజి, పాటల, కలువ, నెయ్యి, గుగ్గిలం, గంధంలాంటి సువాసనలు రావాలి.
5. హోమం చేస్తున్నప్పుడు కుండంలో అగ్ని జ్వాల గొడుగులాగా కుడివైపుకి తిరుగుతుంటే యజమానికి శుభం జరుగుతుంది. అలాగే అగ్ని నుంచి వెలువడే ధూమం (పొగ) తెల్లగా లేక ఎర్రగా వుంటే మరింత శుభప్రదం.
6. హోమగుండం నుంచి దుర్గంధం వస్తే హోమం చేసేవాడికి దుఃఖం కలుగుతుంది. అగ్నిశిఖలు చిందరవందరగా ఏర్పడితే యజమానికి మరణం లేదా రోగం లేదా ధన నష్టం జరుగుతాయి. హోమకుండం నుంచి వచ్చే పొగ ఆకుపచ్చరంగు లేక పావురం రంగులో వుంటే పశునష్టం జరుగుతుంది. హోమం చేస్తున్నప్పుడు ఈ విధమైన దోషాలు కనబడితే సాధకుడు మూలమంత్రాన్ని పఠించి దోష పరిహారార్థం అని సంకల్పం చెప్పి 25 ఆహుతుల్ని ఆజ్యంతో సమర్పించాలి.

# సరస్వతీ మంత్ర భేదాలు

## 1. సరస్వతీ దశాక్షర మంత్రం

వద వద వాగ్వాదినీ స్వాహా

అస్య శ్రీ సరస్వతీ దశాక్షర మంత్రస్య కణ్వ ఋషిః। విరాట్‌ఛందః। శ్రీ సరస్వతీ అనుగ్రహ సిద్ధ్యర్థం జపే వినియోగః ।

| | కరన్యాసం | హృదయన్యాసం |
|---|---|---|
| వద వద | అంగుష్ఠాభ్యాం నమః | హృదయాయ నమః |
| వాగ్వాదినీ | తర్జనీభ్యాం నమః | శిరసేస్వాహా |
| స్వాహా | మధ్యమాభ్యాం నమః | శిఖాయైవషట్ |
| వదవద | అనామికాభ్యాం నమః | కవచాయ హుం |
| వాగ్వాదినీ | కనిష్ఠికాభ్యాం నమః | నేత్రత్రయాయౌషట్ |
| స్వాహా | కరతలకరపృష్ఠాభ్యాం నమః | అస్త్రాయ ఫట్ |

**భూర్భువస్సువరోమితి దిగ్బంధః**

**ధ్యానం :**

**తరుణశకలమిందోర బిభ్రతీ శుభ్రకాంతిః । కుచభరనమితాంగీ సన్నిషణ్ణాసితాబ్జే । నిజకరకమలోద్యల్లేఖినీ పుస్తక శ్రీః । సకల విభవసిద్ధ్యై పాతు వాగ్దేవతా నః ॥**

**పురశ్చరణ :** ఈ మంత్రాన్ని 10లక్షలసార్లు జపించాలి. తద్దశాంశం హోమ తర్పణమార్జన విప్రభోజనాది పురశ్చరణాంగాలని ఆచరించాలి.పాలతో తడిపిన కలువపూలు లేక త్రిమధురాలతో (పాలు, తేనె, పంచదార) కూడిన తిలలతో(నువ్వుల) హోమం చేయాలి.

**కామ్య ప్రయోగాలు :**

★ మంత్రసిద్ధి పొందిన సాధకుడు వాగీశ్వరమంత్రంతో నీటిని అభిమంత్రించి, ఆ నీటిని ఒక సంవత్సరం పాటు నిత్యం సేవిస్తే గొప్పకవి, పండితుడు అవుతాడు. అలాగే ఈ వాగీశ్వరీ మంత్రాన్ని నిత్యం ఒకవేయిసార్లు చొప్పున ఒక సంవత్సరం జపించిన సాధకుడు కవిగా ప్రసిద్ధి చెందుతాడు.

## హంస వాగీశ్వరీ మంత్రం (1)

**ఓం హ్రీం ఐం క్లీం ఓం సరస్వత్యై నమః**

అస్య శ్రీ వాగీశ్వరీ ఏకాదశాక్షర మంత్రస్య కణ్వ ఋషిః। విరాట్ఛందః। వాణీ దేవతా। శ్రీ హంసవాగీశ్వరీ అనుగ్రహ సిద్ధ్యర్థం సర్వేష్ట సిద్ధ్యర్థే జపే వినియోగః।

| | కరన్యాసం | హృదయన్యాసం |
|---|---|---|
| ఓం | అంగుష్ఠాభ్యాం నమః | హృదయాయ నమః |
| హ్రీం | తర్జనీభ్యాం నమః | శిరసేస్వాహా |
| ఐం | మధ్యమాభ్యాం నమః | శిఖాయైవషట్ |
| క్లీం | అనామికాభ్యాం నమః | కవచాయ హుం |
| ఓం | కనిష్ఠికాభ్యాం నమః | నేత్రత్రయాయౌషట్ |
| సరస్వత్యైనమః | కరతలకరపృష్ఠాభ్యాం నమః | అస్త్రాయ ఫట్ |

**భూర్భువస్సువరోమితి దిగ్బంధః**

**ధ్యానం :** వాణీం పూర్ణ నిశాకరోజ్వలముఖీం కర్పూరకుంద ప్రభాం ।
చంద్రార్ధాంకిత మస్తకాం నిజకరైః సంబిభ్రతీమాదరాత్ ।
వీణామక్షగుణం సుధాఢ్యకలశం విద్యాం చ తుంగస్తనీం ।
దివ్యైరాభరణైర్విభూషిత తనుం హంసాధిరూఢాం భజే ॥

**పురశ్చరణ :**

ఈ హంసవాగీశ్వరీ మంత్రాన్ని 12లక్షలసార్లు జపిస్తే సిద్ధిస్తుంది. దశాంశ హోమం 12వేల సార్లు తెల్లకలువలు, లేదా నాగమల్లి, సంపెంగపూలతో చేయాలి.

## హంస వాగీశ్వరీ మంత్రం (2)

**ఐం వాచస్పతే అమృతే ప్లువః ప్లుః**

అస్య శ్రీ హంసవాగీశ్వరీ ఏకాదశాక్షర మంత్రస్య కణ్వ ఋషిః। విరాట్ఛందః। వాణీ దేవతలూ। ఐం బీజం। ప్లుః శక్తిః।శ్రీ హంసవాగీశ్వరీ అనుగ్రహ సిద్ధ్యర్థం జపే వినియోగః।

| | కరన్యాసం | హృదయన్యాసం |
|---|---|---|
| ఐం | అంగుష్ఠాభ్యాం నమః | హృదయాయ నమః |
| వాచస్పతే | తర్జనీభ్యాం నమః | శిరసేస్వాహా |
| అమృతే | మధ్యమాభ్యాం నమః | శిఖాయైవషట్ |
| ప్లవః | అనామికాభ్యాం నమః | కవచాయ హుం |
| ప్లుః | కనిష్ఠికాభ్యాం నమః | నేత్రత్రయాయౌషట్ |
| ఐం వాచస్పతే అమృతే ప్లవః ప్లుః | కరతలకరపృష్ఠాభ్యాం నమః | అస్త్రాయ ఫట్ |

**భూర్భువస్సువరోమితి దిగ్బంధః**

**ధ్యానం :** అసీనాకమలే కరైర్జపవటీం పద్మద్వయం పుస్తకం ।
బిభ్రాణా తరుణేందుబద్ధమకుటాముక్తేందు కుంద ప్రభాం ।
భాలోన్మీలిత లోచనా కుచభరాక్రాంతా భవత్ భూతయే ।
భూయాద్ వాగధిదేవతా మునిగణైరాసేవ్యమానాఽనిశమ్ ॥

**పురశ్చరణ :** ఈ మంత్రాన్ని 11 లక్షల సార్లు జపించి, తద్దవంశం 1 లక్షాపదివేలు లేక 11వేల సార్లు ఆవునేతితో హోమం చేయాలి. మిగిలిన పురశ్చరణాంగాలు యధావిధిగా ఆచరించాలి.

**కామ్య ప్రయోగాలు :**

★ మోదుగపూలతో హోమం చేస్తే సకల విద్యలూ సిద్ధిస్తాయి.

★ కడిమిపూలు(లేక)బిల్వఫలాలతో హోమం చేస్తే సంపదలు, శాస్త్రవిజ్ఞానం పెంపొందుతాయి.

★ మల్లెపూలు, గంధతగర (నంద్యావర్త) పుష్పాలతో హోమంచేస్తే కవి, పండితుడు అవుతారు. (కామ్యహోమాలని కనీసం 10వేల సార్లు చేయాలి)

## హంస వాగీశ్వరీ మంత్రం (3)

**ఐం రూం స్వోం**

అస్య శ్రీ వాగీశ్వరీ త్ర్యక్షర మంత్రస్య కణ్వ ఋషిః। విరాట్ఛందః। వాణీ దేవతా। ఐం బీజం। రూం శక్తిః ।శ్రీ వాగీశ్వరీ ప్రసాద సిద్ధ్యర్థం జపే వినియోగః।

| | కరన్యాసం | హృదయన్యాసం |
|---|---|---|
| ఐం | అంగుష్ఠాభ్యాం నమః | హృదయాయ నమః |
| రూం | తర్జనీభ్యాం నమః | శిరసేస్వాహా |
| స్వోం | మధ్యమాభ్యాం నమః | శిఖాయైవషట్ |
| ఐం | అనామికాభ్యాం నమః | కవచాయ హుం |
| రూం | కనిష్ఠికాభ్యాం నమః | నేత్రత్రయాయౌషట్ |
| స్వోం | కరతలకరపృష్ఠాభ్యాం నమః | అస్త్రాయ ఫట్ |

**భూర్భువస్సువరోమితి దిగ్బంధః**

**ధ్యానం :**

ముక్తాహారావదాతాం శిరసి శశికళాలంకృతాం బహుభిః స్వైః ।
వ్యాఖ్యాం వర్ణాక్షమాలాం మణిమయ కలశం పుస్తకం చోద్వహంతీం ।
ఆపీనోత్తుంగ వక్షోరుహభర వినమన్మధ్యదేశా మధీశాం ।
వాచామీడే చిరాయ త్రిభువన మితాం పుండరీకే విషణ్ణామ్ ॥

**పురశ్చరణ :** ఈ మంత్రాన్ని 3 లక్షల సార్లు జపిస్తే సిద్ధిస్తుంది. తద్దశాంశం ఆవునేతితో కలిసిన పాయసంతో హోమం చేయాలి. మిగిలిన పురశ్చరణాంగాలు యధావిధిగా ఆచరించాలి.

**కామ్య ప్రయోగాలు :**

★ చందనం, గంధంతో తడిపిన జాజిపూలు, తెల్లకలువలు, నంద్యావర్తపుష్పాలు, మల్లెలు, వీటన్నిటితో లేక ఏ ఒక్కదానితోనైనా హోమం (పదివేలసార్లు) చేస్తే వాక్సిద్ధి కలుగుతుంది.

★ ఈ మంత్రాన్ని నిత్యం జపించిన సాధకుడికి సభావిజయం, వాదవిజయం కలుగుతుంది.

★ ఈ త్ర్యక్షర మంత్రాన్ని పఠిస్తూ తెల్లవస, సరస్వతీ ఆకు కలిపిన చూర్ణాన్ని తింటే జ్ఞాపకశక్తి పెంపొందుతుంది.

## 2. శ్రీ సరస్వతీ అష్టాక్షర మంత్రం ( బ్రహ్మవైవర్త పురాణం )

అస్య శ్రీ సరస్వతీ అష్టాక్షర మంత్రస్య బ్రహ్మ ఋషిః । బృహస్పతి ఛందః। శ్రీకృష్ణ పరమాత్మా దేవతా । శ్రీ సరస్వతీ కటాక్ష సిద్ధ్యర్థం జపే వినియోగః

| | **కరన్యాసం** | **హృదయన్యాసం** |
|---|---|---|
| శ్రీం హ్రీం | అంగుష్ఠాభ్యాం నమః | హృదయాయ నమః |
| సరస్వత్యై | తర్జనీభ్యాం నమః | శిరసేస్వాహా |
| స్వాహా | మధ్యమాభ్యాం నమః | శిఖాయైవషట్ |
| శ్రీం హ్రీం | అనామికాభ్యాం నమః | కవచాయ హుం |
| సరస్వత్యై | కనిష్ఠికాభ్యాం నమః | నేత్రత్రయాయౌషట్ |
| స్వాహా | కరతలకరపృష్ఠాభ్యాం నమః | అస్త్రాయ ఫట్ |

**భూర్భువస్సువరోమితి దిగ్బంధః**

**ధ్యానం :** సరస్వతీం శుక్లవర్ణాం సస్మితాం సుమనోహరాం ।
కోటిచంద్ర ప్రభాజుష్ట పుష్టశ్రీయుక్త విగ్రహాం ।
సుపూజితాం సురగణైర్బ్రహ్మ విష్ణు శివాదిభిః ।
వందే భక్త్యా వందితాం తాం మునీంద్ర మను మానవైః॥

**శ్రీం హ్రీం సరస్వత్యై స్వాహా**

**పురశ్చరణ :** ఈ సరస్వతీ అష్టాక్షర మంత్రాన్ని 4 లక్షల సార్లు జపించాలి. దశాంశహోమాన్ని నువ్వులు, తెల్లటి పువ్వులు, ఆవునేతితో చేయాలి. తరువాత తర్పణాది పురశ్చరణాంగాలన్నీ యధావిధిగా ఆచరించాలి. ఇలా చేస్తే మంత్రం సిద్ధిస్తుంది.

## 3. శ్రీ మహా సరస్వతీ మంత్రం (నారద పురాణం)

అస్య శ్రీ సరస్వతీ ద్వాదశాక్షర మహామంత్రస్య నారాయణ ఋషిః । విరాట్ ఛందః । మహా సరస్వతీ దేవతా । శ్రీమహాసరస్వతీ ప్రీత్యర్థం జపే వినియోగః

| | **కరన్యాసం** | **హృదయన్యాసం** |
|---|---|---|
| ఓం శ్రీ మహాదేవ్యై | అంగుష్ఠాభ్యాం నమః | హృదయాయ నమః |
| సరస్వత్యై | తర్జనీభ్యాం నమః | శిరసేస్వాహా |
| స్వాహా | మధ్యమాభ్యాం నమః | శిఖాయైవషట్ |
| ఓం శ్రీమహాదేవ్యై | అనామికాభ్యాం నమః | కవచాయ హుం |
| సరస్వత్యై | కనిష్ఠికాభ్యాం నమః | నేత్రత్రయాయౌషట్ |
| స్వాహా | కరతలకరపృష్ఠాభ్యాం నమః | అస్త్రాయ ఫట్ |

**భూర్భువస్సువరోమితి దిగ్బంధః**

**ధ్యానం :** కర్పూర కుంద ధవళాం పూర్ణ చంద్రోజ్వలాననమ్ ।
హంసాధిరూఢాం బాలేందు దివ్యాలంకార శోభితామ్ ।

**ఓం శ్రీ మహాదేవ్యై సరస్వత్యై స్వాహా**

**పురశ్చరణ :** ఈ మంత్రాన్ని పదిలక్షల సార్లు జపించాలి. దశాంశహోమాన్ని పదివేలసార్లు తెల్లని పద్మాలు లేక నాగచంపక పుష్పాలతో చేయాలి. తరువాత తర్పణాది పురశ్చరణాంగాలన్నీ యధావిధిగా ఆచరించాలి.

**కామ్యప్రయోగాలు :**

★ ఈ సరస్వతీ మంత్రసిద్ధి పొందినవాడు వాక్పతి అవుతాడు.

★ ఒకసంవత్సరం పాటు ప్రతిరోజూ ఈ మంత్రాన్ని 1008 సార్లు శ్రద్ధగా జపిస్తే మహాకవి అవుతాడు.

★ ప్రతిరోజూ నదిలో గుండెలోతు నీళ్ళలో నిలబడి సూర్యమండలంలో సరస్వతీదేవిని దర్శిస్తూ మూడువేలసార్లు ఈ మంత్రాన్ని జపించాలి. ఇలా 40రోజుల పాటు చేస్తే మంత్రం సిద్ధిస్తుంది.

★ మధురపదార్థాలు, పలాశ, బిల్వ పుష్పాలు లేక సమిధలతో హోమం చేస్తే అఖండమైన కీర్తి ప్రతిష్ఠలు లభిస్తాయి.

## శ్రీ సరస్వతీ మంత్రోపాసకులు పాటించాల్సిన నియమాలు

- ★ సరస్వతీ మంత్ర ఉపాసకులు ఉల్లి, వెల్లుల్లి, మారేడు, నువ్వులనూనె తినరాదు.
- ★ రాత్రినిలువ ఉంచిన పదార్థాలని ఉదయం తినకూడదు.
- ★ రాత్రిపూట తాంబూలం వేసుకోకూడదు.
- ★ పగటిపూట స్త్రీ సంగమం చేయరాదు.
- ★ నగ్నంగా వున్న స్త్రీలని చూడకూడదు.
- ★ రెండు సంధ్యాకాలాల్లో నిద్రపోకూడదు.
- ★ అబద్ధం చెప్పకూడదు. ★ పుస్తకాల్ని దాటివెళ్ళకూడదు.
- ★ అక్షరాల్ని, కాగితాల్ని హీనంగా చూడకూడదు.
- ★ స్త్రీలని నిందించకూడదు. ప్రదోషకాలంలో మౌనంగా వుండాలి.
- ★ అష్టమి, చతుర్దశి, అమావాస్య, పౌర్ణమి, పాడ్యమి, గ్రహణాలు, సంక్రాంతి రోజుల్లో అధ్యయనం చేయకూడదు.
- ★ గ్రంథాల్ని వ్యాఖ్యానించేడప్పుడు నిద్ర, ఆవులింత, ఒళ్ళు విరుచుకోవటం నిషిద్ధం
- ★ ఈ విధంగా నియమాలు పాటిస్తూ సరస్వతీ మంత్రోపాసన చేసిన సాధకుడు బృహస్పతితో సమానుడై వాక్సిద్ధిని పొందుతాడు.



# సరస్వతీ అష్టోత్తర శతనామస్తోత్రమ్

1. సరస్వతీ మహాభద్రా మహామాయా వరప్రదా
   శ్రీప్రదా పద్మనిలయా పద్మాక్షీ పద్మవక్త్రకా
2. శివానుజా పుస్తకధృత్ జ్ఞానముద్రా రమా పరా
   కామరూపా మహావిద్యా మహాపాతక నాశినీ
3. మహాశ్రయా మాలినీ చ మహాభోగా మహాభుజా
   మహాభాగా మహోత్సాహా దివ్యాంగాసురవందితా
4. మహాకాళీ మహాపాశా మహాకారా మహాంకుశా
   సీతాచ విమలా విశ్వా విద్యున్మాలా చ వైష్ణవీ
5. చంద్రికా చంద్రవదనా చంద్రలేఖా విభూషితా
   సావిత్రీ సురసా దేవీ దివ్యాలంకార భూషితా
6. వాగ్దేవి వసుధా తీవ్రా మహాభద్రా మహాబలా
   భోగదా భారతీ భామా గోవిందా గోమతీ శివా
7. జటిలా వింధ్యవాసా చ వింధ్యాచల విరాజితా
   చండికా వైష్ణవీ బ్రాహ్మీ బ్రహ్మజ్ఞానైక సాధనా
8. సౌదామినీ సుధామూర్తి స్సుభద్రా సురపూజితా
   సువాసినీ సునాసా చ వినిద్రా పద్మ లోచనా
9. విద్యారూపా విశాలాక్షీ బ్రహ్మజాయా మహాఫలా
   త్రయీమూర్తిః త్రికాలజ్ఞా త్రిగుణా శాస్త్రరూపిణీ
10. శుంభాసుర ప్రమథినీ శుభదా చ స్వరాత్మికా
    రక్తబీజ నిహంత్రీ చ చాముండా చాంబికా తథా
11. ముండకాయ ప్రహరణా ధూమ్రాలోచన మర్దనా
    సర్వదేవ స్తుతా సౌమ్యా సురాసుర నమస్కృతా
12. కాళరాత్రీ కళాధారా రూప సౌభాగ్య దాయినీ
    వాగ్దేవీ చ వరారోహా వారాహీ వారిజాసనా

13. చిత్రాంబరా చిత్రగంధా చిత్రమాల్య విభూషితా
కాంతా కామప్రదా వంద్యా విద్యాధర సుపూజితా

14. శ్వేతాసనా నీలభుజా చతుర్వర్గ ఫలప్రదా
చతురానన సామ్రాజ్య రక్తమధ్యా నిరంజనా
హంసాసనా నీలజంఘా బ్రహ్మ విష్ణుశివాత్మికా
ఏవం సరస్వతీ దేవ్యా నామ్నామష్టోత్తరం శతమ్

## శ్రీ సరస్వతీ స్తోత్రం

1. యా కుందేందుతుషారహారధవళా యా శుభ్రవస్త్రావృతా
యా వీణావరదండమండితకరా యా శ్వేతపద్మాసనా
యా బ్రహ్మాచ్యుతశంకర ప్రభృతిబిర్దేవైః సదా వందితా
సా మాం పాతు సరస్వతీ భగవతీ నిశ్శేషజాడ్యాపహా

2. ఆశాసురాశీభవదంగవల్లీ భాసైవ దాసీకృత దుగ్ధసింధుమ్
మందస్మితైః నిందితశారదేందుం వందే అరవిందాసనసుందరీత్వామ్

3. శారదా శారదాంభోజవదనా వదనాంబుజే
సర్వదా సర్వదాస్మాకం సన్నిధిం సన్నిధం క్రియాత్

4. సరస్వతీం చ తాం నౌమి వాగధిష్ఠాతృదేవతామ్
దేవత్వం ప్రతిపద్యంతే యదనుగ్రహతో జనాః

5. పాతు నో నికషగ్రావమతిహేమ్నః సరస్వతీ
ప్రాజ్ఞేతరపరిచ్ఛేదం వచసైవ కరోతి యా

6. శుక్లాం బ్రహ్మవిచారసారపరమామాద్యాం జగద్వ్యాపినీం
వీణాపుస్తకధారిణీమభయదాం, జాడ్యాంధకారాపహామ్
హస్తే స్ఫాటికమాలికాం, చ దధతీం, పద్మాసనే సంస్థితాం
వందే తాం పరమేశ్వరం భగవతీం, బుద్ధిప్రదాం శారదామ్

7. వీణాదరే! విపుల మంగళ దానశీలే! భక్తార్తినాశిని! విరించి హరీశవంద్యే!
కీర్తిప్రదే అఖిల మనోరథదే! మహార్హే! విద్యాప్రదాయిని! సరస్వతి! నౌమి నిత్యమ్

8. శ్వేతాబ్జ పూర్ణ విమలాసన సంస్థితే!
హే శ్వేతాంబరావృత మనోహర మంజుగాత్రే!
ఉద్యన్మనోజ్ఞ సితపంకజ మంజులాస్యే!
విద్యాప్రదాయిని! సరస్వతి ! నౌమి నిత్యమ్.

9. మాతస్త్వదీయ పదపంకజభక్తియుక్తా
యే త్వాం భజన్తి నిఖిలానపరాన్ విహాయ,
తే నిర్జరత్వమిహ యాన్తి కళేబరేణ
భూవాహ్నివాయు గగనాంబు వినిర్మితేన

10. మోహాంధకారభరితే హృదయే మదీయే
మాతః ! సదైవ కురు వాసముదారభావే!
స్వీయాఖిలావయవ నిర్మలసుప్రభాభిః
శీఘ్రం వినాశయ మనోగత మంధకారమ్.

11. బ్రహ్మా జగత్ సృజతి పాలయతీందిరేశః
శంభుర్వినాశయతి దేవి! తవ ప్రభావైః
న స్యాత్ కృపా యది తవ ప్రకటప్రభావే
న స్యుః కథంచిదపి తే నిజకార్యదక్షాః

12. లక్ష్మీర్మేధా ధరా పుష్టిః గౌరీ తుష్టిః ప్రభా ధృతిః ,
ఏతాభిః పాహి తనుభిరష్టాభిర్మాం సరస్వతి!

13. సరస్వత్యై నమో నిత్యం భద్రకాళ్యై నమో నమః
వేదవేదాంతవేదాంగ విద్యాస్థానేభ్య ఏవ చ.
సరస్వతి! మహాభాగే! విద్యే! కమలలోచనే!
వీద్యారూపే! విశాలాక్షి! విద్యాం దేహి నమోస్తుతే.

15. యదక్షరం పదం భ్రష్టం మాత్రాహీనం చ యద్భవేత్.
తత్ సర్వం క్షమ్యతాం దేవి! ప్రసీద పరమేశ్వరి!



# శ్రీ మహాసరస్వతీ స్తుతులు

1. ఘంటాశూలహలాని శంఖముసలే చక్రం దనుస్సాయకం
హస్తాబ్జైః దధతీం ఘనాంత విలసత్ శ్రీతాంశు తుల్య ప్రభాం
గౌరీదేహ సముద్భవాం త్రిజగతా మాధార భూతాం మహాం
పూర్వాయత్రసరస్వతీ మనుభజే శుంభాదిదైత్యార్ధినీమ్

2. సరస్వతీం శుక్లం వర్ణాం సస్మితాం సుమనోహరాం
కోటి చంద్రప్రభాముష్టపుష్ట శ్రీయుక్త విగ్రహాం
వహ్ని శుద్ధాం శుకాధానం వీణాపుస్తక ధారిణీం
రత్న సారేంద్ర నిర్మాణ నవభూషణ భూషితాం

3. సుపూజితాం సురగణైః బ్రహ్మవిష్ణు శివాదిభిః
వందే భక్తాం వందితాం చ మునీంద్ర మనోమాతరైః

4. నీహార హార ఘనసార సుధాకరాభాం
కల్యాణదాం కనక చంపక దామ భూషాం
ఉత్తుంగ పీన కుచకుంభ మనోహరాంగీం
వాణీం నమామి వచసాం విభూత్యై

యా వేదాంతార్ధ తత్వైక స్వరూపాం పరమార్థతః
నామ రూపత్మనా వ్యక్తా సా మాం పాతు సరస్వతీ 1
యా వర్ణ పద వాక్యార్థ స్వరూపేణైవ వర్తతే
అనాది నిధనానంత సా మాం పాతు సరస్వతీ 2
అధ్యాత్మ మధిదైవం చ దేవానాం సమ్యగీశ్వరీ
ప్రత్యగా స్తేవదంతీ యా సా మాం పాతు సరస్వతీ 3
అంతర్యామ్యాత్మనా విశ్వం త్రైలోక్యం యాని యచ్ఛతి
ధ్యాయంతి సర్వరూపైకా సా మాం పాతు సరస్వతీ 4
యా ప్రత్యగ్దృష్టిభి ర్జీవై ర్వ్యజ్యమానాను భూయతే
వ్యాపినీ జ్ఞప్తిరూపైకా సా మాం పాతు సరస్వతీ 5

నామ జాత్యాదిభి ర్భేదై రష్టదా యా వికల్పితా
నిర్వికల్పాత్మానా వ్యక్తా సా మాం పాతు సరస్వతి 6
వ్యక్తావ్యక్తగిరాస్సర్వే వేదాద్య వ్యాహరంతి యాం
సర్వకామదుఘా ధేనుః సాం మాం పాతుం సరస్వతీ 7
నామ రూపాత్మకం సర్వం యస్యా మావేశతాం పునః
ధ్యాయంతి బ్రహ్మరూపైకా సా మాం పాతు సరస్వతీ 8
చతుర్ముఖ ముఖాంబోజ వన హంసవధూర్మమ
మానసే రమతాం నిత్యం సర్వశుక్లాం సరస్వతీ 9
నమస్తే శారదదేవీ భాసరపుర వాసినీ
త్వామహం ప్రార్థయే నిత్యం విద్యాదానం చ దేహిమే 10
అక్షసూత్రాంకుశ ధరా పాశ పుస్తక ధారిణీ
ముక్తాహార సమాయుక్తా వాచి తిష్ఠతు మే సదా 11
కంబుకంఠి సుతామ్రోష్ఠీ సర్వాభరణ భూషితా
మహా సరస్వతీ దేవీ జిహ్వాగ్రే సన్నివేశ్వతామ్ 12
యా శ్రద్ధా ధారణా మేధా వాగ్దేవీ విధి వల్లభా
భక్త జిహ్వాగ్ర సదానా శమాది గుణ దాయినీ 13
నమామి యామినీనాథ రేఖాలంకృత కుంతలాం
భవానీ భవ సంతాప నిర్వాణ సుదానదీం 14
యః కవిత్వం నిరాంతకం భుక్తి ముక్తీ చ కుంతలాం
సోభ్యర్చైనాం దశశ్లోక్యా నిత్యం స్తౌతి సరస్వతిం 15
తస్యైవం స్తువతో నిత్యం సమభ్యర్చ్య సరస్వతీం
భక్తి శ్రద్ధాభియుక్తస్య షాణ్మాసా త్ప్రత్యయో భవేత్ 16
తతః ప్రవర్తతే వాణి స్వేచ్ఛయా లలితాక్షరా
గద్యపద్యాత్మకై శ్శబ్దై రప్రమేయై ర్వివక్షితైః 17
అశ్రుతో బుధతే గ్రంథః ప్రాయ స్సారస్వతః కవిః



## శ్రీసరస్వతీ దేవి కవచ స్తోత్రం ( బ్రహ్మావైవర్త పురాణం )

**గోలోకంలో శ్రీకృష్ణుడు బ్రహ్మదేవుడికి ఉపదేశించినది**

అస్య శ్రీ సరస్వతీ కవచస్తోత్ర మంత్రస్య బ్రహ్మ ఋషిః, బృహస్పతి ఛందః, శ్రీకృష్ణపరమాత్మ దేవతా, మమ సకల కామ్య సిద్ధ్యర్థ్యం, విద్యాజ్ఞాన, కవిత్వరచనా శక్తి ప్రాప్త్యర్థం పారాయణే వినియోగః ।

ఓం హ్రీం సరస్వత్యై స్వాహా శిరోమే పాతు సర్వతః ।
శ్రీ వాగ్దేవతాయై స్వాహా ఫాలంమే సర్వతా ఽవతు ॥

ఓం సరస్వత్యై స్వాహేతి శ్రోతం పాతు నిరంతరం ।
ఓం శ్రీం హ్రీం భారత్యై స్వాహా నేత్రయుగ్మం సదా ఽవతు ॥

ఓం హ్రీం వాగ్వాదిన్యై స్వాహా నాసాంమే సర్వతోఽవతు ।
హ్రీం విద్యాధిష్ఠాతృదేవ్యై స్వాహా శ్రోతం సదాఽవతు ॥
ఓం శ్రీం హ్రీం బ్రాహ్మ్యైస్వాహేతి దంతపంక్తీః సదాఽవతు ।
ఐమిత్యేకాక్షరో మంత్రో మమ కంఠం సదాఽవతు ॥

ఓం శ్రీం హ్రీం పాతు మే గ్రీవాం స్కంధం మే శ్రీ సదాఽవతు ।
శ్రీం విద్యాధిష్ఠాతృదేవ్యై స్వాహా వక్షః సదాఽవతు ॥

ఓం హ్రీం విద్యాస్వరూపాయై స్వాహా మే పాతు నాభికం ।
ఓం హ్రీం హ్రీం వాణ్యైస్వాహేతి మమ పృష్ఠం సదాఽవతు ॥

ఓం సర్వ వర్ణాత్మికాయై పాదయుగ్మం సదాఽవతు ।
ఓం రాగాధిష్ఠాతృదేవ్యై సర్వాంగం మే సదాఽవతు ॥

ఓం సర్వకంఠవాసిన్యై స్వాహా ప్రాచ్యాం సదాఽవతు ।
ఓం హ్రీం జిహ్వాగ్రవాసిన్యై స్వాహాఽగ్నిదిశి రక్షతు ॥

ఓం ఐం హ్రీం శ్రీం సరస్వత్యై బుధ జనన్యై స్వాహా ।
సతతం మంత్రరాజోఽయం దక్షిణేమే సదాఽవతు ॥

ఓం శ్రీం హ్రీం త్ర్యక్షరోమంత్రో నైఋత్యాం మే సదాఽవతు ।
కవి జిహ్వాగ్రవాసిన్యై స్వాహా మాం వారుణేఽవతు ॥

ఓం సదంబికాయై స్వాహా వాయవ్యే మాం సదాఽవతు ।
ఓం గద్యపద్యవాసిన్యై స్వాహా మాముత్తరే ఽవతు ॥
ఓం సర్వశాస్త్రవాసిన్యై స్వాహైశాన్యాం సదాఽవతు ।
ఓం సర్వపూజితాయై స్వాహా చోర్ధ్వం సదాఽవతు ॥
ఐం హ్రీం పుస్తకవాసిన్యై స్వాహాఽధోమాం సదాఽవతు ।
ఓం గ్రంథబీజరూపాయై స్వాహా మాం సర్వతోఽవతు ॥
ఇతి థే కథితం విప్ర సర్వమంత్రౌఘ విగ్రహం ।
ఇదం విశ్వజయం నామ కవచం బ్రహ్మరూపకం ॥

"ఓం హ్రీం సరస్వత్యై స్వాహా" అను మంత్రము నా శిరస్సునంతయు రక్షించుగాక
"శ్రీం వాగ్దేవతాయై స్వాహా" అనునది నా నొసటిని రక్షించుగాక
"ఓం హ్రీం సరస్వత్యై స్వాహా" అనునది నా చెవులనెల్లప్పుడు రక్షించుగాక
"ఓం హ్రీం వాగ్వాదిన్యై స్వాహా" అనునది నా నాసిక నంతట రక్షించుగాక.
"హ్రీం విద్యాధిష్ఠాతృదేవ్యై స్వాహా' అను మంత్రము నా చెవుల్ని రక్షించుగాక.
"ఐం" అను ఏకాక్షరమంత్రము నా కంఠము నెల్లప్పుడు రక్షించుగాక.
"ఓం శ్రీం హ్రీం"అనేది నా మెడను, "శ్రీం"అనునది నా స్కంధముల రక్షించుగాక.
"శ్రీం విద్యాధిష్ఠాతృ దేవ్యై స్వాహా" అనునది నా వక్షమునెల్లప్పుడు రక్షించుగాక.
"ఓం హ్రీం విద్యాస్వరూపాయే స్వాహా" అనునది నా నాభిని ఎల్లప్పుడు రక్షించుగాక.
"ఓం హ్రీం హ్రీం వాణ్యైస్వాహా" అనునది నా పృష్ఠమును ఎల్లప్పుడు రక్షించుగాక.
"ఓం సర్వ వర్ణాత్మికాయై" అనునది నా పాదములనెల్లప్పుడు రక్షించుగాక.
"ఓం రాగాధిష్ఠాతృదేవ్యై" అను మంత్రము నా సమస్తావయవములను రక్షించుగాక.
"ఓం సర్వ కంఠవాసిన్యై స్వాహా" అనునది నా తూర్పుదిక్కును రక్షించుగాక.
"ఓం హ్రీం జిహ్వాగ్రవాసిన్యై స్వాహా" అను మంత్రము నా ఆగ్నేయదిశను రక్షించుగాక.
"ఓం ఐం హ్రీం శ్రీం సరస్వత్యై బుధ జనన్యై స్వాహా" అను మంత్రరాజం నాకు దక్షిణదిక్కును ఎల్లప్పుడు రక్షించుగాక.

"ఓం శ్రీం హ్రీం" అను మంత్రమును నా నైఋతి దిక్కును రక్షించుగాక.
"కవి జిహ్వాగ్ర వాసిన్యై స్వాహా" అను మంత్రము నా పశ్చిమదిక్కును రక్షించుగాక.
"ఓం సదంబికాయై స్వాహా" అనునది నా వాయువ్య దిక్కును రక్షించుగాక.
"ఓం గద్యవాసిన్యై స్వాహా" అనునది నా ఉత్తర దిక్కును రక్షించుగాక.
"ఓం సర్వ శాస్త్రవాసిన్యైస్వాహా" అనునది నా ఈశాన్య దిక్కును రక్షించుగాక.
"ఓం సర్వ పూజితాయై స్వాహా" అనునది నా ఊర్ధ్వ దిక్కును రక్షించుగాక.
"ఓం హ్రీం పుస్తక వాసిన్యై స్వాహా" అనునది నా అథో దిక్కును రక్షించుగాక.
"ఓం గ్రంథ బీజరూపాయై స్వాహా" అను మంత్రం నన్ను అన్ని వైపులనుండి రక్షించుగాక. *(శ్లో. 73-85, అధ్యా-4, ఖండం-2)*

**కవచపారాయణ విధి :** మహిమోపేతమైన ఈ కవచాన్ని గురుముఖతః ఉపదేశం పొందాలి. ఐదులక్షల సార్లు ఈ కవచం పారాయణ చేస్తే సిద్ధిస్తుంది. ఇది సిద్ధిపొందినవాడు బృహస్పతితో సమానమైన పాండిత్యం పొందుతాడు. మంచికవి, వక్త అవుతాడు. సర్వత్రా అతడికి విజయం లభిస్తుంది. ఈ కవచాన్ని భూర్జపత్రం మీద లేక రాగి, వెండి, బంగారు రేకుమీద లిఖించి దాన్ని తాయెత్తులో పెట్టి గంధపుష్పాలతో పూజించి కుడిచేతికి, లేక మెడలో ధరిస్తే మంచిది.

**సరస్వతీ కవచవైభవం :** ఈ దివ్యకవచాన్ని పారాయణ చేసాకే బృహస్పతికి అంతటి మేధస్సు లభించింది. శుక్రుడు కూడా దీన్ని పఠించి అసురులకి గురువయ్యాడు. వాల్మికి మహాకవిగా మారాడు. స్వాయంభువ మనువు ప్రజాపతి అయ్యాడు. కృష్ణద్వైపాయనుడు ఈ సరస్వతీ కవచాన్ని ఉపాసించే వేదవిభాగం చేయగలిగాడు. సమస్త పురాణాల్ని రచించగలిగాడు. ఇలా ఎంతోమంది మహర్షులు ఈ కవచాన్ని శ్రద్ధగా పారాయణ చేసి అభిలషితార్థాలు పొందగలిగారు.

O

# శ్రీ సరస్వతీదేవి సహస్రనామ స్తోత్రమ్

**ధ్యానం :**

1. శ్రీమ చ్చందన చ్చతోజ్జ్వల వపుశ్శుక్లాంబరా మల్లికా
   మాలా లాలిత కుంతలా ప్రవిలసన్ముక్తావళీ శోభనా
   సర్వజ్ఞాన నిధాన పుస్తకధరా రుద్రాక్ష మాలాంకితా
   వాగ్దేవీ వరనాంబుజే వసతు మా త్రైలోక్య మాతా శుభా

**శ్రీ నారద ఉవాచ :**

2. భగవ న్పరమేశాన సర్వ లోకైక నాయక
   కథం సరస్వతీ సాక్షాత్ప్రసన్నా పరమేష్ఠిన ః
   కథం దేవ్యా మహావాణ్యా స్సత త్ప్రాప సుదుర్లభమ్
   ఏత స్మే వద తత్త్వేన మహా యోగీశ్వర ప్రభో

**సనత్కుమార ఉవాచ :**

3. సాధు పృష్టం త్వయా బ్రహ్మాన్ గుహ్యా ద్గుహ్యా మనుత్తమమ్
   మయా సంగోపితం యత్నా దిదానీం స్త్రపకాశ్యతే
4. పురా పితామహో దృష్ట్వా జగత్ స్థావర జంగమమ్
   నిర్వికారం నిరాభావం స్తంభీభూత మచేతనమ్
5. సృష్ట్వాత్రైలోక్య మఖిలం వా గభావా త్తథావిధమ్
   తతః కదాచిత్సంజాతా వాణీ సర్వార్ధ శోభితా
6. దివ్య వర్షాయుతం తేన తపో దుష్కర ముత్తమమ్
   అధిక్యా భావత స్స్వస్య పరమేష్టీ జగద్గురు
7. అహమస్మి మహావిద్యా సర్వవాచా మధీశ్వరీ
   మమ నామ్నాం సహస్రం తు ఉపదేక్ష్యా మ్యనుత్తమమ్
8. అనేన సంస్తుతా నిత్యం పత్నీ తవ భవా మ్యహమ్
   త్వయా సృష్టం జగత్సర్వం వాణీయుక్తం భవిష్యతి
9. ఇదం రహస్యం పరమం మమ నామ సహస్రకమ్
   సర్వ పాపౌఘ శమనం మహా సారస్వత ప్రదమ్

10. మహా కవిత్వదం లోకే వాగీశత్వ ప్రదాయకమ్
త్వం వా పరః పుమా న్యస్తు స్తవే నానేన తోషయేత్

11. తస్యాహం కింకిరీ సాక్షా ద్భవిష్యామి న సంశయః
ఇత్యుక్త్వాంతర్దధే వాణీ తదారభ్య పితామహః

12. స్తుత్వా స్తోత్రేణ దివ్యేన తత్పతిత్వ మవాప్తవాన్
వాణీయుక్తం జగత్సర్వం తదారభ్యా భవ న్మునే

13. త త్తే హం సంప్రవక్ష్యామి శృణు యత్నేన నారద
సావధాన మనా భూత్వా క్షణం శుద్ధో మునీశ్వరః
"ఐం వద వద వాగ్వాదినీ స్వాహా"

## సరస్వతీ సహస్రనామ స్తోత్ర ప్రారంభం

1. వాగ్వాణీ వరదా వంద్యా వరారోహా వరప్రదా
వృత్తి ర్వాగీశ్వరీ వార్తా వరా వాగీశవల్లభా

2. విశ్వేశ్వరీ విశ్వవంద్యా విశ్వేశ ప్రియ కారిణీ
వాగ్వాదినీ చ వాగ్దేవీ వృద్ధిదా వృద్ధికారిణీ

3. వృద్ధిర్వృద్ధా విషఘ్నీ చ వృష్టి ర్వృష్టి ప్రదాయినీ
విశ్వారాధ్యా విశ్వమాతా విశ్వధాత్రీ వినాయకా

4. విశ్వశక్తిృశ్వసారా విశ్వా విశ్వవిభావరీ
వేదాంత వేదినీ విద్యా విత్తా వేదత్రయాత్మికా

5. వేదజ్ఞా వేదజననీ విశ్వా విశ్వవిభావరీ
వరేణ్యావాఙ్మయీ వృద్ధా విశిష్ట ప్రియకారిణీ

6. విశ్వతో వదనా వ్యాప్తా వ వ్యపినీ వ్యాపకాత్మికా
వ్యాళఘ్నీ వ్యాళభూషాంగీ విరజా వేదనాయికా

7. వేద వేదాంత సంవేద్యా వేదాంత జ్ఞాన రూపిణీ
విభావరీ చ విక్రాంవ విశ్వామిత్రా విధిప్రియా

8. వష్ఠా విప్రకృష్టా చ విప్రవర్య, ప్రపూజితా
వేదరూపా వేదమయీ వేదమూర్తి శ్చ వల్లభా

**ఓం హ్రీం గురురూపే మాం గృహ్ణ గృహ్ణ**

**ఐం వద వద వాగ్వాదినీ స్వాహా**

9. గౌరీ గుణవతీ గోప్యా గంధర్వ నగర ప్రియా
గుణమాతా గుణాంతస్థా గురురూపా గురుప్రియా

10. గిరివిద్యా గానతుష్టా గాయక ప్రియకారిణీ
గాయత్రీ గిశారాధ్యా గ్గీరీశ ప్రియంకరీ

11. గిరిజ్ఞా జ్ఞానవిద్యా చ గిరిరూపా గిరీశ్వరీ
గీర్మాతా గుణసంస్తుత్యా గణనీయ గుణాన్వితా

12. గూఢరూపా గుహాగోప్యా గోరూపా గౌ ర్గుణాత్మికా
గుర్వీ గుర్వంబికా గుహ్యా గేయజా గృహనాశినీ

13. గృహిణీ గృహదోషఘ్నీ నవఘ్నీ గురవత్సలా
గృహాత్మికా గృహారాధ్యా గృహబాధా వినాశినీ

14. గంగా గిరిసుతా గమ్యా గజయానా గుహస్తుతా
గరుడాసన సంసేవ్యా గోమతి గుణశాలినీ

**ఓం ఐం నమః శారదే శ్రీం శుద్ధే నమః**

**శారదే ఐం వద వద వాగ్వాదినీ స్వాహా**

15. శారదా శాశ్వతీ శైవీ శాంకరీ శంకరాత్మికా
శ్రీశ్శర్వాణీ శతఘ్నీ చ శరచ్చంద్ర నిభాననా

16. శ్మష్టా శమనఘ్నీ చ శతసాహస్ర రూపిణీ
శివా శంభుప్రియా శ్రద్ధా శ్రుతిరూపా శ్రుతిప్రియా

17. శుచిష్మతీ శర్మకరీ శుద్ధిదా శుద్ధిరూపిణీ
శివా శివంకరీ శుద్ధా శివారాధ్యా శివాత్మికా

18. శ్రీమతీ శ్రీమయీ శ్రావ్యా శ్రుతి శ్రవణ గోచరా
శాంతి శ్శాంతికరీ శాంతి శాంతిచార ప్రియంకరీ

19. శీలలభ్యా శీలవతీ శ్రీమాతా శుభకాణీ
శుభవాణీ శుద్ధవిద్యా శుద్ధచిత్త ప్రపూజితా

20. శ్రీకరీ శ్రుతపాపఘ్నీ శుభాక్షీ శుచివల్లభా
శివేతరఘ్నీ శబరీ శ్రవణీయ గుణాన్వితా

21. శారీ శిరీషపుష్పాభా శమనిష్ఠా శమాత్మికా
శమాన్వితా శమారాధ్యా శితికంఠ ప్రపూజితా

22. శుద్ధిః శుద్ధికరీ శ్రేష్ఠా శ్రుతానంతా శుభావహా
సరస్వతీ చ సర్వజ్ఞా సర్వసిద్ధి ప్రదాయినీ
ఓం ఐం వద వద వాగ్వాదినీ స్వాహా

23. సరస్వతీ చ సావిత్రీ సంధ్యా సర్వేప్సిత ప్రదా
సర్వార్తిఘ్నీ సర్వమయీ సర్వవిద్యా ప్రదాయినీ

24. సర్వేశ్వరీ సర్వపుణ్యా సర్గ స్థిత్యంత కారిణీ
సర్వారాధ్యాసర్వమాతా సర్వదేవ నిషేవితా

25. సర్వైశ్వర్య ప్రదా నిత్యా సతీ సత్త్వ గుణాశ్రయా
సర్వక్రమ పదాకారా సర్వదోషనిషూదినీ

26. సహస్రాక్షీ సహస్రాస్యా సహస్ర పద సంయుతా
సహస్రహస్తా సాహస్ర గుణాలంకృత విగ్రహా

26. సహస్రాక్షీ సహస్రాస్యా సహస్ర పద సంయుతా
సహస్రహస్తా సాహస్ర గుణాలంకృత విగ్రహా

27. సహస్రశీర్ష సద్రూపా స్వధాస్వాహా సుధామయీ
షడ్గ్రంథి భేదినీ సేవ్యా సర్వలోకైక పూజితా

28. స్తుత్యా స్తుతిమయీ సాధ్యా సవితృ ప్రియ కాణీ
సంశయ చ్ఛేదినీ సాంఖ్యవేద్యా సంఖ్యా సదీశ్వరీ

29. సిద్ధిదా సిద్ధ సంపూజ్యా సర్వసిద్ధి ప్రదాయినీ
సర్వజ్ఞా సర్వశక్తి శ్చ సర్వ సంపత్ప్రదాయినీ

30. సర్వాశుభఘ్నీ సుఖదా సుఖసంవిత్స్వరూపిణీ
సర్వసంభాషిణీ సర్వ జగత్సమ్మోహినీ తథా

31. సర్వ ప్రియాంకరీ సర్వ శుభదా సర్వమంగళా
సర్వ మంత్రమయీ సర్వతీర్థ పుణ్యఫల ప్రదా

32. సర్వపుణ్యమయీ సర్వ వ్యాధిఘ్నీ సర్వకామదా
సర్వ విఘ్నహరీ సర్వవందితా సర్వమంగళా

33. సర్వమంత్రకరీ సర్వలక్ష్మీ స్సర్వగుణాన్వితా
సర్వానందమయీ సర్వ జ్ఞానదా సత్యనాయికా

34. సర్వజ్ఞానమయీ సర్వ రాజ్యాదా సర్వ ముక్తిదా
సుప్రభా సర్వదా సర్వా సర్వలోక వశంకరీ

35. సుభగా సుందరీ సిద్ధా సిద్ధాంబా సిద్ధమాతృకా
సిద్ధమాతా సిద్ధ విద్యా సిద్ధేశీ సిద్ధరూపిణీ

36. సురూపిణీ సుఖమయీ సేవక ప్రియకారిణీ
స్వామినీ సర్వదా సేవ్యా స్థూలసూక్ష్మా పరాంబికా

37. సారరూపా సరోరూపా సత్యభూతా సమాశ్రయా
సితా సితా సరోజాక్షీ సరోజాసన వల్లభా

38. సరోరుహాభా సర్వాంగీ సురేంద్రాది ప్రపూజితా
ఓం హ్రీం ఐం మహాసరస్వతి సారస్వత ప్రదే

**ఐం వద వద వాగ్వాదినీ స్వాహా**

**మహాదేవీ మహేశానీ మహాసారస్వత ప్రదా**

39. మహాసరస్వతీ ముక్తా ముక్తిదా మలనాశినీ
మహేశ్వరీ మహానందా మహా మంత్రమయీ మహీ

40. మహాలక్ష్మీర్మహావిద్యా మాతా మందర వాసినీ
మంత్రగమ్యా మంత్రమాతా మహామంత్ర ఫలప్రదా

41. మహాముక్తి ర్మహానిత్య మహాసిద్ధి ప్రదాయినీ
మహాసిద్ధా మహామాతా మహదాకార సంయుతా

42. మహా మహేశ్వరీ మూర్తాః మోక్షదామణి భూషణా
మేనకా మానినీ మాన్యా మృత్యుఘ్నీ మేరు రూపిణీ

43. మదిరాక్షీ మదావాసా మఖరూపా మహేశ్వరీ
మహామోహా మహామాయా మాతౄణాం మూర్ధ్ని సంస్థితా

44. మహాపుణ్యా ముదావాసా మహా సంపత్ప్రదాయినీ
మణి పూరైక నిలయా మధురూపా మదోత్కటా

45. మహాసూక్ష్మా మహాశాంతా మహా శాంతి ప్రదాయినీ
మునిస్తుతా మోహా హంత్రీ మాధవీ మాధవ ప్రియా

46. మామహా దేవ సంస్తుత్యా మహిషీగణ పూజితా
మృష్టాన్నదా చ మహేంద్రీ మహేంద్ర పదదాయినీ

47. మతి ర్మతిప్రదా మేధా మర్త్యలోక నివాసినీ
ముఖ్యా మహా నివాసా చ మహాభాగ్య జనాశ్రితా

48. మహిళా మహిమా మృత్యు హారీ మేధా ప్రదాయినీ
మేధ్యా మహా వేగవతీ మహామోక్ష ఫలప్రదా

49. మహాప్రభా చ మహతీ మహాదేవ ప్రియంకరీ
మహాపోషా మహార్థశ్చ ముక్తాహార విభూషణా

50. మాణిక్య భూషణా మంత్రా ముఖ్య చంద్రార్థ శేఖరా
మనోరూపా మనశ్శుద్ధిః మనశ్శుద్ధిప్రదాయినీ

51. మహాకారుణ్య సంపూర్ణా మనోనయన వందితా
మహాపాతక జాలఘ్నీ ముక్తిదా ముక్త భూషణా

52. మనోన్మనీ మహాస్థూలా మహాక్రతు ఫలప్రదా
మహాపుణ్య ఫలప్రాప్యా మాయా త్రిపుర నాశినీ

53. మహానసా మహామేధా మహామోదా మహేశ్వరీ
మాలాధరీ మహోపాయా మహాతీర్థ ఫలప్రదా

54. మహామంగళ సంపూర్ణా మహాదారిద్ర్య నాశినీ
మహామఖా మహామేఘా మహాకాళీ మహాప్రియా

55. మహాభూషా మహాదేవా మహారాజ్ఞీ మదాలయా
ఓం హ్రీం ఐం నమో భగవతి ఐం వద వద వాగ్వాదినీ స్వాహా

56. భూదా భాగ్యదా భోగ్యా భోగ్యదా భోగదాయినీ
భవానీ భూతిదా భూతిః భూమి ర్భూమి సునాయికా

57. భూతధాత్రీ భయహరీ భక్తి సారస్వత ప్రదా
భుక్తి ర్భుక్తి ప్రదా భేక్త్యై భక్తిర్భక్తి ప్రదాయినీ
58. భక్తసాయుజ్యదా భక్త స్వర్గదా భక్త రాజ్యదా
భాగీరథీ భవారాధ్యా భాగ్యసజ్జనపూజితా
59. భవస్తుత్యా భానుమతీ భవసాగర తారిణీ
భూతిర్భూషా చ భూతేశీ ఫాలలోచన పూజితా
60. భూతా భవ్యా భవిష్యా చ భవవిద్యా భవాత్మికా
బాధాపహారిణీ బంధురూపా భువన పూజితా
61. భవఘ్నీ భక్తిలభ్యా చ భక్త రక్షణ తత్పరా
భక్తార్తి శమనీ భాగ్యా భోగదానకృతోద్యమా
62. భుజంగ భూషణా భీమా భీమాక్షీ భీమ రూపిణీ
భావినీ భ్రాతృ రూపా చ భారతీ భవ నాయికా
63. భాషా భాషావతీ భీష్మా భైరవీ భైరవ ప్రియా
భూతి ర్భాసిత సర్వాంగీ భూతిదా భూతినాయికా
64. భాస్వతీ భగమాలా చ భిక్షాదాన కృతోద్యమా
భిక్షారూపా భక్తికరీ భక్తలక్ష్మీ ప్రదాయినీ
65. భ్రాంతిఘ్నా భ్రాంతి రూపా చ భూతిదా భూతికారిణీ
భిక్షణీయా భిక్షుమాతా భాగ్యవ ద్దృష్టి గోచరా
66. భోగవతీ భోగరూపా భోగ మోక్ష ఫలప్రదా
భోగశ్రాంతా భాగ్యవతీ భక్తాఘౌఘ వినాశినీ

### శ్రీ సరస్వతీ సహస్రనామ స్తోత్రమ్ (శేషం)

*ఓం ఐం క్లీం సౌః బాలే బ్రాహ్మీ బ్రహ్మపత్నీ ఐం వద వద వాగ్వాదినీ స్వాహా*

67. బ్రాహ్మీ బ్రహ్మ స్వరూపా చ బృహతీ బ్రహ్మ వల్లభా
బ్రహ్మదా చ బ్రహ్మమాతా బ్రహ్మణీ బ్రహ్మదాయినీ
68. బ్రహ్మేశీ బ్రహ్మసంస్తుత్యా బ్రహ్మవేద్యా బుధప్రియా
బాలేందు శేఖరా బాలా బలిపూజాకర ప్రియా

69. బలదా బిందురూపా చ బాల సూర్య సమప్రభా
బ్రహ్మరూపా బ్రహ్మమయీ బధ్నమండల మధ్యగా

70. బ్రహ్మణీ బుద్ధిదా బుద్ధి ర్బుద్ధిరూపా బుధేశ్వరీ
బంధక్షయకరీ బాధా నాశనీ బంధురూపిణీ

71. బింద్వాలయా బిందుభూషా బిందు నాద సమన్వితా
బీజరూపా బీజమాతా బ్రహ్మణ్యా బ్రహ్మకారిణీ

72. బహురూపా బలవతీ బ్రహ్మణ్యా బ్రహ్మచారిణీ
బ్రహ్మస్తుత్యా బ్రహ్మవిద్యా బ్రహాండాధిప వల్లభా

73. బ్రహ్మేశా విష్ణురూపా చ బ్రహ్మ విష్ణీశ సంస్థితా
బుద్ధిరూపా బుధేశానీ బంధీ బంధ విమోచనీ

***ఓం హ్రీం ఐం అం అం ఇం ఈం ఉం ఊం ఋం ౠం***
***ఏం ఐం ఓం ఔం కం ఖం గం ఘం ం చం ఛం జం ఝం***
***ఞం టం ఠం డం ఢం ణం తం థం దం ధం నం పం ఫం***
***భం భం మం యం రం లం వం శం షం సం హం ళం***
***క్షం అక్షమాలే అక్షరమాలికా సమాలంకృతే వద వద వాగ్వాదినీ స్వాహా***

74. అక్షమాలాక్షరాకారా క్షరాక్షర ఫలప్రదా
అనంతానంద సుఖదానంత చంద్ర నిభావనా

75. అనంత మహిమాఘోరానంత గంభీర సమ్మితా
అదృష్టా దృష్టిదానంతా దృష్టభాగ్య ఫలప్రదా

76. అరుంధత్యవ్యయీ నాధా నేక సద్గుణ సంయుతా
అనేక భూషణా దృశ్యా నేక లేఖ నిషేవితా

77. అనంతానంత సుఖదా ఘోరా ఘోర స్వరూపిణీ
అశేష దేవతా రూపా మృతరూపా మృతేశ్వరీ

78. అనవద్యా నేక హస్తా నేక మాణిక్య భూషణా
అనేక విఘ్నసంహర్త్రీ త్వనే కాభరాణాన్వితా

79. అవిద్యా జ్ఞాన సంహర్త్రీహ్యవిద్యా జాలనాశినీ
అభిరూపానవద్యాంగీ హ్యప్రతర్క్య గతిప్రదా

80. అకళంకారూపిణీ చ హ్యనుగ్రహ పరాయణా
అంబరస్థాంబర మయాంబర మాలాంబుజేక్షణా
81. అంబికాబ్జ కరాబ్జస్థాంశుమత్యంశు శతాన్వితా
అంబుజానవరాఖండాంబుజాసన మహాప్రియా
82. అజరామర సంసేవ్యాజర సేవిత పద్యగా
అతులార్థ పదార్థైక్యాత్యుదారా త్వభయాన్వితా
83. అనాథ వత్సలానంత ప్రియానంతేప్సిత ప్రదా
అంబుజాక్ష్యంబురూపాంబుజాతోద్భవ మహాప్రియా
84. అఖండా త్వమరస్తుత్యా మరనాయక పూజితా
అజేయాత్వజసంకాశా అజ్ఞాననాశిన్యభీష్టదా
85. అక్తా ఘనేన చాస్త్రేశీ హ్యలక్ష్మీ నాశినీ తథా
అనంతసారానంత శ్రీ రనంత విధి పూజితా
86. అభీష్టామర్త్య సంపూజ్యా హ్యస్తోదయ వివర్జితా
ఆస్తిక స్వాంత నిలయా స్త్రిరూపాస్త్రవతీ తథా
87. అస్ఖలత్యస్ఖలద్రూపా స్ఖలద్విద్యా ప్రదాయినీ
అస్ఖలత్సిద్ధిదానందాంబుజా తామర నాయికా
88. అమేయాశేష పాపఘ్నక్షయ సారస్వత ప్రదా
ఓం జ్యాం హ్రీం జయ జయ జగన్మాతః
**ఐం వద వద వాగ్వాదినీ స్వాహా**
**జయా జయంతీ జయదా జన్మకర్మ వివర్జితా**
89. జగత్ప్రియా జగన్మాతా జగదీశ్వర వల్లభా
జాతి ర్జయా జితామిత్రా జప్యా జపన కారిణీ
90. జీవనీ జీవనిలయా జీవాఖ్యా జీవధారిణీ
జాహ్నవీ జ్యా జపవతీ జాతిరూపా జయప్రదా
91. జనార్దన ప్రియకరీ జోషనీయా జగత్స్థితా
జగజ్జ్యేష్టా జగన్మాయా జీవన త్రాణ కారిణీ

92. జీవాతులతికా జీవా జన్మ జన్మనిబర్హిణీ
జాడ్యవిధ్వంసనకరీ జగద్యోని ర్జయాత్మికా

93. జగదానంద జననీ జంబూశ్చ జలజేక్షణా
జయంతీ జంగ పూగఘ్నీ జనితజ్ఞాన విగ్రహా

94. జటా జటావతీ జప్యా జపకర్తృ ప్రియంకరీ
జపకృత్పాప సంహర్త్రీ జపకృత్ఫలదాయినీ

95. జపాపుష్ప సమ ప్రఖ్యా జపాకుసుమ ధారిణీ
జననీ జన్మరహితా జ్యతిర్వృత్యభిధాయినీ

96. జుటాజూటన చంద్రార్ధా జగత్సృష్టికరీ తథా
జగత్త్రాణకరీ జాధ్యధ్వంసకర్త్రీ జయేశ్వరీ

97. జగద్బీజా జయావాసా జన్మభూః జన్మనాశినీ
జన్మాంత రహితా జైత్రీ జగద్యోని ర్జపాత్మికా

98. జయలక్షణ సంపూర్ణా జయదాన కృతోద్యమా
జంభరాద్యాది సంస్తుత్యా జంభా ఫలదాయినీ

99. జగత్త్రయ హితా జ్యేష్ఠా జగత్త్రయ వశంకరీ
జగత్త్రయాంబా జగతీ జ్వాలా జ్వాలిత లోచనా

100. జ్వాలినీ జ్వలనా భాషా జ్వలతీ జ్వలనాత్మికా
జితారాతి సురస్తుత్యా జితక్రోధా జితేంద్రియా

101. జరా మరణ శూన్యా చ జనిత్రీ జన్మనాశినీ
జలజాభా జలమయీ జలజాసన వల్లభా

102. జలజస్థా జపారాధ్యా జనమంగళకారిణీ ఐం క్లీం సౌః కల్యాణీ కామధారిణీ
వద వద వాగ్వాదినీస్వాహా కామినీ కామరూపా చ కామ్యాకామ్య ప్రదాయినీ

103. కమౌళీ కామదా కర్త్రీ క్రతుకర్మ ఫలప్రదా
కృతఘ్నఘ్నీ క్రియారూపా కార్య కారణ రూపిణీ

104. కంజాక్షి కరుణారూపా కేవలామర సేవితా
కల్యాణ కారిణీ కాంతా కాంతిదా కాంతిరూపిణీ

105. కమలా కమలావాసా కమలోత్పల మాలినీ
శుముద్వతీ చ కల్యాణీ కాంతా కామేశవల్లభా
106. కామేశ్వరీ కమలినీ కామదా కామబంధినీ
కామధేనుః కాంచనాక్షీ కాంచనాభా కళానిధిః
107. క్రియాకీర్తికరీ కీర్తిః క్రతు శ్రేష్ఠా కృతేశ్వరీ
క్రతుః సర్వక్రియా స్తుత్యా క్రతుకృత్ప్రియకాణీ
108. క్లేశనాశకరీ కర్త్రీ కర్మదా కర్మబంధినీ
కర్మబంధ హరీ కృష్ణా కృమఘ్నీ కంజులోచనా
109. కందర్ప జననీ కాంతా కరుణా కరుణావతీ
క్లీం కారిణీ కృపాకారా కృపాసింధుః కృపావతీ
110. కరుణార్ద్రా కీర్తికరీ కల్మషఘ్నీ క్రియాకరీ
క్రియాశక్తి కామరూపా కమలోత్పల గంధినీ
111. కళా కళావతీ కూర్మా కూటస్థా కంజసంస్థితా
కాలికా కల్మషఘ్నీ చ కమనీయ జటాన్వితా
112. కరపద్మాకరాభీష్ట ప్రదా క్రతు ఫలప్రదా
కౌశికీ కోశదా కన్యా కర్త్రీ కోశేశ్వరీ కృశా
113. కూర్మయానా కల్పలతా కాలకూట వినాశినీ
కల్పోద్యానవతీ కల్ప వనస్థా కల్పకాణీ
114. కదంబ కుసుమాభాసా కదంబ కుసుమ ప్రియా
కదంబోద్యాన మధ్యస్థా కీర్తిదా కీర్తి భూషణా
115. కులమాతా కులావాసా కులాచార ప్రియంకరీ
కులానాథా కామకళా కళానాథా కలేశ్వరీ
116. కుంద మందార పుష్పాభా కపర్ద స్థిత చంద్రికా
కవిత్వదా కామ్యమాతా కవిమాతా కళాప్రదా

*ఓం సౌః క్లీం ఐం తతో వద వద వాగ్వాదినీ స్వాహా*

117. తరుణీ తరుణీ తారా తారాధిప సమానవా
తృప్తిస్తృప్తిప్రదా తర్క్యా తపనీ తాపినీ తథా

118. తర్పణీ తీర్థరూపా చ త్రిపదా త్రిదశేశ్వరీ
త్రిదివేశీ త్రిజననీ త్రిమాతా త్ర్యంబకేశ్వరీ

119. త్రిపుర త్రిపురేశానీ త్ర్యంబకా త్రిపురాంబికా
త్రిపురశ్రీ స్త్రయీరూపా త్రయీవేద్యా త్రయీశ్వరీ

120. త్రయ్యంత వేదినీ తామ్రా తాప త్రితయ హారిణీ
తమాలసదృశీ త్రాతా తరుణాదిత్య సన్నిభా

121. త్రైలోక్య వ్యాపినీ తృప్తా తృప్తికృత్తత్త్వరూపిణీ
తుర్యా త్రైలోక్య సంస్తుత్యా త్రిగుణా త్రిగుణేశ్వరీ

122. త్రిపురఘ్నీ త్రిమాతా చ త్ర్యంబకా త్రిగుణాన్వితా
తృష్ణాచ్ఛేదకరీ తృప్తా తీక్ష్ణా తీక్ష్ణ స్వరూపిణీ

123. తులాతులాది రహితా తత్త ద్బ్రహ్మ స్వరూపిణీ
త్రాణకర్త్రీ త్రిపాపఘ్నీ త్రిపదా త్రిదశాన్వితా

124. తథ్యా త్రిశక్తి స్త్రిపదా తుర్యా త్రైలోక్యసుందరీ
తేజస్కరీ త్రిమూర్త్యాద్యా తేజోరూపా త్రిధామతా

125. త్రిచక్ర కర్త్రీ త్రిభగా తుర్యాతీత ఫలప్రదా
తేజస్వినీ తాపహా తాపోపప్లవ నాశినీ

126. తేజోగర్భా తపస్సారా త్రిపురా ప్రియాంకరీ
తపస్వీ తాపన సంతుష్టా తపనాంగజ భీతినుత్

127. త్రిలోచనా త్రిమార్గా చ తృతీయా త్రిదశస్తుతా
త్రిసుందరీ త్రిపథగా తురీయపద దాయినీ

***ఓం హ్రీం శ్రీం క్లీం ఐం నమ శ్శుద్ధఫలదే ఐం వద వద వాగ్వాదినీ స్వాహా***

128. శుభా శుభావతీ శాంతా శాంతిదా శుభదాయినీ
శీతలా శూలిని శీతా శ్రీమతీ చ శుభాన్వితా

***ఓం ఐం యాం యీం యూం యైం యౌం యః ఐం వద వద వాగ్వాదినీ స్వాహా***

129. యోగసిద్ధి ప్రదా యోగ్యా యజ్ఞేన పరిపూరితా
యజ్యా యజ్ఞమయీ యక్షీ యక్షిణీ యక్షవల్లభా

130. యజ్ఞప్రియా యజ్ఞపూజ్యా యజ్ఞతుష్టా యమస్తుతా
యామినీయ ప్రభా యామ్యా యజనీయా యశస్కరీ

131. యజ్ఞకర్త్రీ యజ్ఞరూపా యశోదా యజ్ఞ సంస్తుతా
యజ్ఞేశీ యజ్ఞఫలదా యోగ యోని ర్యజస్తుతా

132. యమీసేవ్యా యమారాధ్యా యమీపూజ్యా యమీశ్వరీ
యోగినీ యోగరూపా చ యోగకర్తృ ప్రియంకరీ

133. యోగయుక్తా యోగమయీ యోగ యోగీశ్వరాంబికా
యోగజ్ఞానమయీ యోనిః యమాద్యష్టాంగ యోగతా

134. యంత్రితా ఘౌఘ సంహరా యమలోక నివారిణీ
యష్టి వ్యష్టీశ సంస్తుత్యా యమాద్యష్టాంగయోగయుక్

135. యోగీశ్వరీ యోగమాతా యోగసిద్ధా చ యోగదా
యోగారూఢా యోగమయీ యోగరూపా యవీయసీ

136. యంత్రరూపా చ యంత్రస్థా యంత్రపూజ్యా చ యంత్రికా
యుగకర్త్రీ యుగమయీ యుగధర్మ వివర్జితా

137. యమునా యమినీ యామ్యా యమునాజల మధ్యగా
యాతాయాత ప్రశమనీ యాతనానాం నికృంతనీ

138. యోగావాసా యోగివంద్యా యత్తచ్ఛబ్ద స్వరూపిణీ
యోగక్షేమ మయీ యంత్రా యావదక్షర మాతృకా

139. యావత్పదమయీ యావచ్ఛబ్దరూపా యథేశ్వరీ
యత్తదీయా యక్షవంద్యా యద్విద్యా యతిసంస్తుతా

140. యావద్విద్యామయీయావ ద్విద్యాబృంద సువందితా
యోగిహృత్పద్మనిలయా యోగివర్యప్రియంకరీ

141. యోగివంద్యా యోగిమాతా యోగీశ ఫలదాయినీ
యక్షవంద్యా యక్షపూజ్యా యక్షరాజ సుపూజితా

142. యజ్ఞరూపా యజ్ఞతుష్టా యాయజాక స్వరూపిణీ
యంత్రారాధ్యా యంత్రమధ్యా యంత్రకర్తృ ప్రియంకరీ

143. యంత్రారూఢా యంత్రపూజ్యా యోగి ధ్యాన పరాయణా
యజనీయా యమస్తుత్యా యోగయుక్తా యశస్కరీ

144. యోగబద్ధా యతిస్తుత్యా యోగజ్ఞా యోగనాయకీ
యోగజ్ఞానప్రదా యక్షీ యమబాధా వినాశినీ

145. యోగికామ్యప్రదాత్రీ చ యోగిమోక్ష ప్రదాయినీ
ఇతి నామ్నాం సరస్వత్యాః సహస్రం సముదీతమ్

146. మంత్రాత్మకం మహాగోప్యం మహా సారస్వత ప్రదమ్
యః పఠేచ్ఛృణుయా ద్భక్త్యా త్రికాలం సాధకః పుమాన్

147 సర్వవిద్యానిధి స్సాక్షాత్ స ఏవ భవతి ధ్రువమ్
లభతే సంపద స్సర్వాః పుత్రపౌత్రాది సంయుతాః

148. మూకో పి సర్వవిద్యాసు చతుర్ముఖ ఇవాపరః
భూత్వా ప్రాప్నోతి సాన్నిధ్యం అంతే ధాతుర్మునీశ్వర

149. సర్వమంత్ర మయం సర్వవిద్యామాన ఫలప్రదమ్
కస్మై చిన్నప్రదాతవ్యం ప్రాణైః కంఠ గతై రపి

150. మహారహస్య సతతం వాణీ నామ సహస్రకమ్
సుసిద్ధ మస్మదాదీనాం స్తోత్రం తే సముదితమ్

**ఇతి శ్రీ స్కాంధపురాణే శ్రీ సరస్వతీ సహస్రనామ స్తోత్రమ్ సంపూర్ణమ్**



# శ్రీ సరస్వతీదేవి స్వరూపం

***చదువుల తల్లిగా, జ్ఞానాన్ని ప్రసాదించే విజ్ఞానరూపిణిగా, సమస్తకళల్ని ప్రసాదించే వరదాయినిగా లోకంలో పూజించబడే శ్రీ సరస్వతీదేవి మూల స్వరూపం ఈ విధంగా వుంటుంది.***

సర్వపూజ్యా సర్వవంద్యా చాన్యాం మత్తో నిశామయ ।
వాగ్బుద్ధి విద్యా జ్ఞానాధిష్ఠాత్రీ చ పరమాత్మనః ॥
సర్వవిద్యా స్వరూపాయా సా చ దేవీ సరస్వతీ ।
సా బుద్ధిః కవితా మేధా ప్రతిభా స్మృతికా నృణాం ॥

నానాప్రకార సిద్ధాంత భేదార్థకలనా మతా ।
వ్యాఖ్యా బోధ స్వరూపా చ సర్వసందేహభంజనీ ॥
విచారకారిణీ గ్రంథకారిణీ శక్తిరూపిణీ ।
స్వరసంగీత సంధాన తాళ కారణ రూపిణీ ॥

విషయజ్ఞాన వాగ్రూపా ప్రతివిశ్వోపజీవినీ ।
వ్యాఖ్యావాదకరీ శాంతా వీణాపుస్తక ధారిణీ ॥
శుద్ధసత్త్వ స్వరూపా చ సుశీలా శ్రీహరిప్రియా ।
హిమచందన కుందేందు కుముదాంభోజ సన్నిభా ॥

సిద్ధివిద్యా స్వరూపా చ సర్వసిద్ధి ప్రదాసదా ।
యయావినాతు విప్రౌఘోమూకోమృత సమః సదాః ॥

***(బ్రహ్మవైవర్తం-ద్వితీయఖండం-శ్లో॥31-37)***

సర్వజనులందరిచేతా పూజించబడేది, నమస్కరించబడేది, పరమాత్మ యొక్క వాక్కు, బుద్ధి, జ్ఞానాలకి మూలకారణ స్వరూపిణి అయిన సరస్వతీదేవి, సకల విద్యాస్వరూపిణిగా, జనులందరి హృదయాల్లో బుద్ధిలో కొలువుండి వారందరికీ, కవిత్వం, మేధ, ప్రతిభ, స్మృతి లాంటి శక్తుల్ని కలిగిస్తుంది.

వివిధరకాలుగా సిద్ధాంతాలు చేసే పండితుల వాఖ్యానార్థాల్లో కొలువుంటూ వారి సందేహాల్ని పోగొట్టి వారికి సరైన వివేచనాజ్ఞానాన్ని ప్రసాదిస్తుంది. ఇంకా చెప్పాలంటే కవులు పండితులు గ్రంథాల్ని రచించగలగటానికి సంగీత విద్వాంసులు స్వర, సంగీత, సంధాన, తాళ, లయ, నాదాలగురించి తెలుసుకోగలగటానికీ ఈ సరస్వతీదేవే కారణం. అలాంటి ఈ తల్లి పండితుల్లో చర్చ, విషయ, జ్ఞాన, వ్యాఖ్య, వాదన, వాక్య స్వరూపిణిగా, పరభాషామయిగా, ఈ విశ్వానికంతా భాషని ప్రసాదించే భాషారూపిణిగా, శాంత, నిర్మల సుప్రసన్న రూపంతో వీణా పుస్తకాల్ని ధరించి, శుద్ధ సత్త్వస్వరూపంతో, సుశీలగా, శ్రీహరిప్రియగా, మంచు, చందనం, చంద్రుడు, మల్లె, కమలం, లాంటి శోభలతో ప్రకాశిస్తోంది.

ఈ సరస్వతీదేవి వేదాల్లో తపఃస్వరూపిణిగా, తపస్సుచేసే వారికి తగిన జ్ఞానాన్ని అనుగ్రహించేదిగా, వేదజననిగా, సిద్ధవిద్యాస్వరూపిణిగా, సర్వసిద్ధుల్ని ప్రసాదించేదిగా, వర్ణించబడింది. అటువంటి ఈ చదువులతల్లి అనుగ్రహం లేకపోతే బ్రాహ్మణులు మూగవారితో, మరణించిన వారితో సమానమవుతారు.



# శ్రీ సరస్వతీ దివ్యస్తుతి మహిమ

పూర్వం యాజ్ఞవల్క్యమహర్షి ప్రారబ్ధవశాన గురుశాపానికి గురయ్యాడు. ఆయన శాప ప్రభావంతో యాజ్ఞవల్క్యుడు నేర్చిన విద్యలన్నీ మరిచిపోయాడు. దానితో ఆయనకి తీవ్రమైన వేదన కలిగింది. ఎంతో దుఃఖంతో కోణార్క క్షేత్రానికి వెళ్ళి సూర్యభగవానుణ్ణి స్తుతించాడు. ఆయన వేదన గ్రహించి సూర్యుడు ప్రత్యక్షమై యాజ్ఞవల్క్యుడికి వేదవేదాంగాలని, సకల శాస్త్రాలనీ బోధించాడు. అవన్నీ ఆయనకి శాశ్వతంగా జ్ఞాపకం ఉండటంకోసం సరస్వతీ దేవిని స్తుతించమని చెప్పి అంతర్ధానమయ్యాడు. సూర్యుడి ఆజ్ఞప్రకారం యాజ్ఞవల్క్యుడు ఒక శుభముహూర్తంలో శుచిగా స్నాన సంధ్యలు అనుష్ఠించి సరస్వతీదేవిని భక్తిగా ఇలా స్తుతించాడు.

కృపాంకురు జగన్మాతః మామేవం హతతేజసం ।
గురుశాపాత్ స్మృతి భ్రష్టం విద్యాహీనం చ దుఃఖితం ॥
జ్ఞానం దేహి స్మృతిందేహి విద్యాం విద్యాధిదేవతే ।
ప్రతిష్ఠాం కవితాం దేహి శక్తిం శిష్య ప్రబోధికాం ॥

గ్రంథ నిర్మితి శక్తిం చ సచ్ఛిష్యం సుప్రతిష్ఠితం ।
ప్రతిభాం సత్సభాయాం చ విచారక్షమతాం శుభాం ॥

లుప్తాం సర్వాం దైవవశాన్నవాం కురు పునః పునః ।
యథాంకురం జనయతి భగవన్యోగమాయయా ॥

బ్రహ్మ స్వరూపా పరమా జ్యోతిరూపా సనాతనీ ।
సర్వ విద్యాధిదేవీ యా తస్యై వాణ్యై నమో నమః ॥

యయావినా జగత్సర్వం శశ్వజ్జీవన్మృతం సదా ।
జ్ఞానాధిదేవీ యా తస్యై సరస్వత్యై నమో నమః ॥

యయా వినా జగత్సర్వం మూక మున్మత్తవత్సదా ।
వాగధిష్ఠాతృదేవీ యా తస్యై వాణ్యై నమో నమః ॥

హిమ చందన కుందేదు కుముదాంభోజ సన్నిభా ।
వర్ణాధి దేవీ యా తస్యై చాక్షరాయై నమో నమః ॥

విసర్గబిందుమాత్రాణాం యదధిష్ఠానమేవచ ।
ఇత్థం త్వం గీయసే సద్భిః భారత్యై తే నమోనమః ॥

యయా వినాఽత్ర సంఖ్యాకృత్సంఖ్యాం కర్తుం న శక్నుతే ।
కాల సంఖ్యా స్వరూపా యా తస్యై దేవ్యై నమోనమః ॥

వ్యాఖ్యా స్వరూపా యా దేవీ వ్యాఖ్యాధిష్ఠాతృదేవతా ।
భ్రమ సిద్ధాంతరూపా యా తస్యై దేవ్యై నమో నమః ॥

స్మృతి శక్తి జ్ఞానశక్తి బుద్ధి శక్తి స్వరూపిణీ । ***(బ్రహ్మవైవర్త పురాణం)***
ప్రతిభా కల్పనాశక్తిర్యా చ తస్యై నమోనమః॥ ***(శ్లో॥6-17,అధ్యా-5,ఖం.-2)***

యాజ్ఞవల్క్యుడు చేసిన స్తుతికి సరస్వతీ దేవి ఎంతో సంతోషించింది. నిరాహారుడై ఆయన చూపిన భక్తి శ్రద్ధల్ని గుర్తించి ఒక దివ్యజ్యోతిగా ఆయనకి దర్శనమిచ్చింది. యాజ్ఞవల్క్యుడు ఎంతో తాదాత్మ్యంతో ఆజ్యోతికి నమస్కరించాడు. సరస్వతీదేవి ఆయన్ని అనుగ్రహించి తిరిగి అంతర్ధానమైపోయింది.

**స్తుతి పారాయణ ఫలం :** యాజ్ఞవల్క్యకృతమైన ఈ సరస్వతీ స్తుతిని భక్తి శ్రద్ధలతో పారాయణ చేసినవాడు గొప్ప కవీంద్రుడవుతాడు. మంచి వక్తగా ఎంతో కీర్తి ప్రతిష్ఠలు సంపాదిస్తాడు. పరమమూర్ఖుడైనప్పటికీ ఈ స్తోత్రాన్ని నియమంగా ఒక సంవత్సరకాలం పఠిస్తే అతడు గొప్ప పండితుడవుతాడు.

## సరస్వతీ పూజకు కావలసిన ద్రవ్యాలు

తెల్లనిపూలు, సువాసనతో వున్న తెల్ల చందనం, తెల్లని వస్త్రాలు, శంఖం, తెల్లపువ్వులమాల, ముత్యాలు, పూజలో ఉపయెగించాల్సిన ద్రవ్యాలు. సరస్వతీదేవికి నైవేద్యంగా వెన్న, పెరుగు, పాలు, పేలాలు, నువ్వుండలు, చెరకు, చెరకురసం, తెల్లబెల్లం, పంచదార, తెల్లటి బియ్యంతో వండిన అన్నం, అటుకులు, నేయి, సైంధవలవణం ఉపయోగించి చేసిన వంటకాలు, నేయికలిపిన యవలు, పరమాన్నం, కొబ్బరికాయ, కొబ్బరినీళ్ళు, అరటి, నేరేడు, రేగు పళ్ళు వంటివి నైవేద్యంగా ఉపయోగించాలి.

# శ్రీ సరస్వతీ ప్రార్థనా దశకమ్

**శ్రీ శివశంకర శివయోగీ**

ప్రజాపతే సృష్టికార్యప్రసక్తేఽ మేయరూపిణి ।
ప్రవృత్తిధర్మసంపత్తిం ప్రదేహ్యంబ సరస్వతి ॥ 1

కంసారిప్రముఖారాధ్యే హంసారూఢే ప్రదేహి మే ।
సంసారసౌఖ్యసంపత్తిం శంసాపాత్రే సరస్వతి ॥ 2

సర్వజ్ఞోసోదరాకారే సర్వజ్ఞే సద్దయాన్వితే ।
సహ మాత్రాదిభిర్వృత్తం సరస్వత్యంబ దేహి మే ॥ 3

సర్వవేదాంత సంవేద్యే సచ్చిదానందరూపిణి ।
సత్యాశ్రయే సదారాధ్యే సరస్వత్యంబ పాహిమామ్ ॥ 4

దేవాధీశాదివంద్యాంఘ్రీం భావాతీతాం భవాత్మికాం ।
యా వాగగోచరా వందే శ్రీవాగ్దేవీం సరస్వతీమ్ ॥ 5

కలాత్మికాం కలాకోశ కలాలంకృత కుంతలామ్ ।
ఇలావంద్యామహం వందే విలాసాఢ్యాం సరస్వతీమ్ ॥ 6

చరాచరాత్మికాం శక్తిం సురాసుర సమర్చితామ్ ।
గిరాం దేవీమహం నిత్యం పరాం వందే సరస్వతీమ్ ॥ 7

యా గీష్పతి సమారాధ్యా భోగీడిత సుఖప్రదా ।
వాగీశ్వరీమహం వందే యోగీంద్రేఢ్యాం సరస్వతీమ్ ॥ 8

రాజరాజేశ్వరీరూపాం రాజరాజసమర్చితామ్ ।
రాజహంసరథామీడే రాజద్భూషాం సరస్వతీమ్ ॥ 9

వేదాంతాధిగతార్థా యా నాదాతీత స్వరూపిణీ ।
మోదాత్మికా చ సా పాయాః శ్రీదామాం శ్రీ సరస్వతీ ॥ 10

శ్రీ సరస్వతీ ప్రార్థనా దశకమ్ సమాప్తమ్